# మద్యమా?   మానవ మనుగడా ??

## (మద్య వ్యతిరేక కరపత్రాల సంకలనం)



ప్రచురణ

**సహృదయ మిత్రమండలి**

**మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి**

**పిఠాపురం.**

**మద్యమా ? మానవ మనుగడా ??**
**(మద్య వ్యతిరేక కరపత్రాల సంకలనం)**

సంపాదకత్వం & సంకలనం

**గౌరవ్ & సతీష్**

**ముద్రణ కాలం :** అక్టోబర్ 2, 2022

**ప్రచురణ :** సహృదయ మిత్ర మండలి, మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి

**మూల్యం :**
అమూల్యం



**విజ్ఞప్తి :**
ఈ కరపత్రాల్లోని భావాలన్నీ ఆయా సందర్భాలలో పేర్కొన్నవే కానీ సంఘ సభ్యులు, సంపాదక, సంకలనకర్తలు వాటన్నింటితోనూ తప్పనిసరిగా ఏకీభవించనవసరం లేదు.

**గమనిక :**
ఇందులోని కరపత్రాలు రావు కృష్ణారావు, సూర్య ప్రకాశరావు, డా. ఓరుగంటి సత్యనారాయణ, గౌరవ్, ఎన్. గంగబాబు తదితరులు రాసినవి. చివర్లోని గీతం గట్టి శ్రీకృష్ణ దేవరాయలు రాసారు. కరపత్రాలన్నీ సంఘాల పేరిటే ప్రచురించబడ్డాయి కాని వ్యక్తుల పేరిట కాదు. అందుకే కరపత్రాల్లో వ్యక్తుల పేర్లు లేవని మనవి.


**ప్రాప్తి స్థానం :**
ఎన్. సూర్యనారాయణ
సహృదయ మిత్రమండలి, రిజిస్టర్డు నెం :703/2011
14-1-11,వంగల వారి వీధి, పిఠాపురం, కాకినాడ జిల్లా
పిన్ : 533450, ఫోన్ : 08869 - 250218

**వివరాలకు :** సెల్ : 96525 52556


# అంకితం



**మంచి మనిషి, మానవతా వాది సామాన్యుడిగా ఉంటూనే తన ఆలోచనలు - ఆచరణలో అసామాన్య ప్రజాహిత - కార్యక్రమాలకి రూపకల్పన చేసిన మాస్టారు, 'సహృదయ మిత్రమండలి' ప్రధాన వ్యవస్థాపకులూ, చివరి వరకూ ప్రజాహితం కోసం తపించిన ఆలోచనాశీలి కీ.శే. టీ.వి.ఎల్. నరసింహారావు గారి అభిమాన ఆత్మీయ స్మృతికి.......**

## కరుణాకర్ గారి స్మృతిలో...



కీ. శే. కరుణాకర్ గారు మొదట్నుంచీ మద్యపాన వ్యతిరేక ప్రచార ఉద్యమంలో భాగస్వామి. అంతేకాదు, మంచి సినిమా ప్రచారోద్యమంలో చాలా కాలంగా మాతో ట్రావెల్ చేసారు. మంచి కవి, రచయిత, కథకులు, కార్టూనిస్టు అన్నింటి కన్నా ముఖ్యంగా మంచి మనిషి. ఎన్నో ప్రజా సంఘాలతో మమేకమైన ఉద్యమశీలి. ఒంగోలు దగ్గరలో పిల్లలతో పని చేయడమే ప్రపంచంగా జీవించారు. మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి గతంలో ప్రచురించిన ఒక పుస్తకానికి టైటిల్ కోసం అర్థవంతమైన ముఖచిత్రం స్వయంగా వేసి పంపించారు. విజ్ఞాన వేదిక ఆధ్వర్యంలో ముద్రించాల్సి ఉన్న ఆ పుస్తకం ఏమైందో ఇప్పటికీ తెలియలేదు. కాన గత సంవత్సరం గతించిన కరుణాకర్ గారి స్మృతిలో ఆయన ప్రేమగా వేసి పంపిన ఆ చిత్రాన్ని ఇలా ఈ ప్రయత్నానికి ఉపయోగించడం జరిగింది. ఈ పుస్తక ముఖ చిత్రం ఆయన వేసినదే.

# కరపత్రాల సూచిక



# ఒక సంకల్పం-మూడు సందర్భాలు !

మంచి మనసుతో మరో మనిషి కోసం ఆలోచించే కొద్దిమంది వ్యక్తులు, 'సొంత లాభం కొంత మానుకుని పొరుగు వారికి తోడు పడమన్న' పెద్దాయన మాటల్నే మహా మంత్రంగా తీసుకుని స్వామి వివేకానంద స్ఫూర్తితో సరిగ్గా ఇరవై ఏళ్ళ క్రితం స్థాపించిన స్వచ్ఛంద సంస్థ "సహృదయ మిత్ర మండలి". మద్యం తదితర మత్తు పదార్థాలు మానవాళికి చేస్తున్న వినాశనానికి వ్యతిరేకంగా, బలమైన గొంతుకై సామాన్యుల వైపు నిలబడి నినదించాలనే ఉద్దేశంతో వ్యసనాల్ని గురించి ప్రచారం కోసం కొంతమంది సామాజిక స్పృహ ఉన్న మిత్రులు సమిష్టిగా సరిగ్గా పదేళ్ళ క్రితం ఏర్పాటు చేసుకున్న సంఘమే "మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి".

ఈ రెంటి జన్మస్థానం పిఠాపురం కాగా, శాస్త్ర ప్రచార ఉద్యమమే లక్ష్యంగా 'ప్రజల కోసం సైన్స్' అనే నిర్దేశంతో విజ్ఞాన ప్రయోజనాలు బడుగు జీవుల కోసమనే స్పష్టమైన దృక్పథంతో తెలుగు రాష్ట్రాలలో అప్పటికే ఉన్న అనేక ప్రజా సైన్స్ సంఘాలన్నీ కలిసి సరిగా 35 ఏళ్ళ క్రితం విజయవాడలో ఐక్య సంఘటనగా పరిణమించిన చారిత్రక రూపమే "జనవిజ్ఞాన వేదిక". పై రెంటికి బలమైన వెన్నెముకగా నిలిచింది.

మూడు దశాబ్దాల విజ్ఞాన వేదిక ప్రస్థానంలో తిరుగులేని ముద్ర వేసిన చారిత్రక మద్యపాన వ్యతిరేక ఉద్యమం, అక్షరాస్యత ఉద్యమాలే ఒక రకంగా రెండు రూపాల్లో వ్యక్తం కాబడ్డాయని అనుకోవచ్చు. యువతని సామాజిక స్పృహ గల ఆలోచనాపరులుగా మలచాలనే ఆశయం సహృదయ మిత్ర మండలి రూపంలో వ్యక్తం కాగా, యువతని వ్యసన విముక్తుల్ని చేయాలనే తపనతో ఆవిర్భవించింది మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి.

ఈ సందర్భాలన్నింటినీ తన జీవితంలో అనుసంధానం చేసుకున్న సహృదయులు, ఎరిగిన వారంతా ప్రేమతో మాష్టారూ అని పిలుచుకునే టి.ఎల్.

నరసింహారావు గారు మరణించడం ఇతరేతర సంస్థలతోపాటూ ముఖ్యంగా 'సహృదయ మిత్ర మండలికి తీరని లోటు. మండలిలోని సహృదయానికి చిహ్నం మాస్టారైతే సంస్థ సభ్యులు, మరో మనిషి కోసం ఆలోచించే అందరూ ఆయన మిత్రులే.

మాస్టారి నిష్క్రమణ కలిగించే నిస్తేజం నుండి కోలుకుంటూ జీవితాంతం ఆయన తపించిన వ్యసన వ్యతిరేక ప్రచారంలో భాగంగా ఇన్నేళ్ళ కాలంలో వివిధ సందర్భాలలో మద్యానికి వ్యతిరేకంగా ప్రచురించిన కొన్ని కరపత్రాలను ఇలా ఒక్క దరికి చేర్చి చిన్న సంకలనంగా తీసుకు వద్దామని నిర్ణయించుకున్నాం. ఇదిగో ఫలితంగా ఇదిలా మీ చేతిలో ఉంది.

ఇది వెలుగు చూడటానికి కారణమయిన మాస్టారి కుటుంబ సభ్యులు, బంధుమిత్రులు, హితులు, శ్రేయోభిలాషులు, అలాగే మిత్ర మండలి సభ్యులు, మద్య వ్యతిరేక సమితి బాధ్యులు, విజ్ఞాన వేదిక మిత్రులు ఇంకా పట్టణంలోని పెద్దలు, ముఖ్యులు, మంచి సమాజం కోసం కలిసొచ్చే సహృదయులు అందరికీ పేరుపేరునా మా అభినందనలు.

చాలా చిన్నగా కూడదీసుకుని వేస్తున్న అడుగుల్లో, మరొకరిని చేరదీసుకుని సాగిపోయే క్రమంలో ఇదో చిన్న ముందడుగు అని మా అభిప్రాయం. మాస్టారి స్మృతి చిహ్నంగా ప్రచురిస్తున్న ఈ చిన్న పుస్తకం అందుకు ఎంత మాత్రం ఉపయోగపడి యువత వ్యసనాల నుండి బయటపడి సరైన గాడిలో పడటానికి ఈషన్మాత్రం స్ఫూర్తినిచ్చినా ఈ కృతికి సార్థకత చేకూరుతుందనేది మా అభిప్రాయం. చదివాక మీ విలువైన అభిప్రాయాలు కూడా పంచుకుంటే సంతోషం.





# 1. మద్యమా? మానవ మనుగడా?

మన సమాజంలో కోట్లమంది మద్యానికి బానిసలై తమ జీవితాలను నాశనం చేసుకోవడమే కాక, తమ కుటుంబాలను నాశనం చేస్తున్నారు. సమాజానికి భారంగా తయారవుతున్నారు. అనేక సందర్భాలలో పెనుముప్పుగా పరిణమిస్తున్నారు. మద్యం అక్రమ తయారి అరికట్టలేమని, ఆదాయం పోతున్నదని సాకులు చెప్పి నిషేదాన్ని ఎత్తివేసిన ప్రభుత్వం మద్యపానాన్ని అనేక విధాల ప్రోత్సహిస్తున్నది. మద్యం ఏరులై పారుతున్నది. అనేక విధాల దోపిడికి గురవుతున్న ప్రజలు తిరుగుబాటు చేయకుండా వారిని మత్తులో ముంచే ప్రయత్నమే మద్యపానానికి లభిస్తున్న ప్రోత్సాహం.

మద్యం మెదడుకు, నాడీవ్యవస్థకు శాశ్వతమైన హాని చేస్తుంది. మనిషి తన సంకల్పబలాన్ని, వ్యక్తిత్వాన్ని కోల్పోతాడు. మద్యం అనేక విధాల ఆరోగ్యానికి హాని చేస్తుంది. ఎంతో నైపుణ్యం గల పనివారు మద్యంమత్తు వల్ల తమ నైపుణ్యాలను కోల్పోవడం మనం రోజూ చూస్తూనే ఉంటాం!

మన విశిష్ట లక్షణమైన ఆలోచనా శక్తిని నశింపచేసే మద్యాన్ని సేవించడం సమర్ధనీయమేనా? ఆలోచించండి! అంతర్గత చైతన్యం లోపించినవారే మద్యాన్ని ఆశ్రయిస్తారని గోర్కీ అన్నాడు. మన సమాజం అందులో మన జీవితం చాలా బాధాభరితంగా ఉన్నమాట నిజమే. ఆ బాధల నుండి పారిపోవడానికి మద్యాన్ని సేవించడం పెనం మీద నుండి పొయ్యిలోకి పడటమే. అంచెలంచెలుగ మద్యపాన నిషేధం అమలు చేస్తానన్న ప్రభుత్వం అంచెలంచెలుగా పెంచుకుంటూ పోతోంది. మద్యం మన జీవితాన్ని మరింత దుఃఖ భరితం చేస్తుంది. కష్టాలు తట్టుకొనే శక్తిని తగ్గించి వేస్తుంది. మానసికంగా మనల్ని బలహీనుల్ని చేస్తుంది. మనల్ని ఆవరించి వున్న దుర్భర పరిస్థితులను మార్చుడానికి మద్యం పేరు మీద దోపిడీని అరికట్టడానికి పోరాడుతూ మన జీవితాలను మెరుగు పరచుకొనే ప్రయత్నంలో మాత్రమే మనకు నిజమైన ఆనందం లభిస్తుంది. కష్టాల పొగలోన "కన్నెర్ర" చేయమన్నాడు ఒక కవి.

**మద్యపానం మానండి! మాన్పించండి!!**

**నిషేధానికై పోరాడండి !!**

## సారా, బ్రాందీలు త్రాగితే వచ్చే అనర్థాలు

- ✤ సారా, బ్రాందీలు త్రాగేవారి కాలేయం (లివర్) దెబ్బతిని "సిరోసిస్ ఆఫ్ లివర్" (బానపొట్ట) అనే జబ్బు వస్తుంది. ఖరీదైన మందులకు కూడా లొంగని జబ్బు.
- ✤ సారా, బ్రాందీలు త్రాగితే గుండె కండరం దెబ్బతిని గుండె పెరిగే జబ్బు వస్తుంది. దీని వలన మనిషి ఏ నిమిషమైన చనిపోవచ్చు.
- ✤ సారా, బ్రాందీ త్రాగేవారికి పేగులలో పుండుపడి "గ్యాస్ట్రిటిస్" రోగం వస్తుంది. ఇదే క్యాన్సర్‌గా మారే ప్రమాదం ఉంది.
- ✤ సారా, బ్రాందీలు త్రాగే వారికి నరాల బలహీనత వస్తుంది.
- ✤ సారా, బ్రాందీలు త్రాగేవారికి మెదడు నరాల దెబ్బతిని "సైకోసిస్" అంటే పిచ్చి పట్టవచ్చు. ఈ వ్యాధి సోకిన వారు ఆత్మహత్య చేసుకోవచ్చు లేదా భయం పెరిగి భ్రమలకు లోనవుతారు.
- ✤ కండరాలు దెబ్బతింటాయి. దీనినే "స్కెలిటల్ మయోపతీ" అంటారు. ఈ జబ్బు ముదిరితే వాళ్ళ పనులు కూడా వారు చేసుకోలేరు.
- ✤ తల్లి తండ్రులు సారాయి, బ్రాందీలు తాగితే పిల్లలు రోగాలతో పుడతారు.
- ✤ సారా, బ్రాందీలు త్రాగేవారికి కాలేయం దెబ్బతిని, వృషణాలు సన్నబడి సెక్స్ సామర్థ్యం తగ్గిపోతుంది.
- ✤ రోడ్డు ప్రమాదాలు ఎక్కువశాతం సారా, బ్రాందీలు త్రాగటం వల్లనే ఎక్కువగా జరుగుతున్నాయి.
- ✤ తాగిన మైకంలో చీకటి తప్పు వలన ఎయిడ్స్ బారినపడి మరణించిన వారు ఎందరో!

**ఇకనైన మనమందరం కళ్ళు తెరుద్దాం !**



# 2. మద్యపాన వ్యతిరేక ప్రచారోద్యమంలో భాగస్వాములుకండి

మద్యపానం చేయని వారిని హీనంగా చూసే వ్యవస్థలో ఇప్పుడు మనం ఉన్నాం. ఒకప్పుడు తాగడాన్ని వింతగా చూసే లోకం, ఈరోజు తాగకపోతే చింతిస్తోంది. ఖరీదైన విద్య, కార్పోరేట్ సంస్కృతిలో తాగడమనేది భాగమేనని బోధిస్తుంటే, కంపెనీ వైద్యం అసలు తాగడమనేది తప్పే కాదని చూపిస్తోంది. ధ్వంసమౌతున్న వ్యవస్థలో విలువలనేవి ఉదాసీనంగా చూడబడడం సహజం. అందులో భాగంగానే తాగి ఊగిన ప్రతివారికి విలక్షణమైన వ్యక్తిత్వాన్ని అంటకట్టడము, తాగడాన్ని దైనందిన జీవితంలో తప్పనిసరికార్యంగా భావించడము జరుగుతోంది. నిరంతరం పెరుగుతున్న నిత్యావసర వస్తువుల ధరల్ని పట్టించుకోకుండా ఉండడానికి, రోజురోజుకి విజృంభిస్తున్న నిరుద్యోగ సమస్యని గుర్తించకుండా చేయడానికి, అన్నింటిని మించి సమాజంలో విస్తృతమౌతున్న ధనిక పేద వర్గాల మధ్య తేడా తేటతెల్లంగా వెల్లడౌతున్నా గమనించకుండా చూడడానికి, ఈ మద్యపానం మందిని మత్తులో ముంచేయడానికి మహాద్భుతంగా ఉపయోగపడుతోంది. విద్యార్థి దశలోనే విస్కీ, బ్రాందీ, బీర్ల వైపు ఆకర్షింపబడుతోన్న బాల్యం, కౌమార దశ కొచ్చేనాటికి ప్రాణాల్ని పణంగా పెట్టి మరీ మందుకొట్టే పార్టీల సంస్కృతికి అలవాటు పడుతోంది. సాంఘిక బహిష్కరణకి గురి కావలసిన మద్యపానం సామాజిక హోదాకి చిహ్నంగా భావించబడడం, ప్రస్తుత మన అధ్వాన్నస్థితికి నిదర్శనం. కల్లు, సారాల ఫలితంగా భయంకరమైన దుర్ఘటనలు సంభవిస్తున్న సందర్భంగా, అట్టడుగు వర్గాల ప్రజల్ని మధ్య తరగతి జనాల్ని ఎరగా తీసుకొని మత్తులో వారిని జీవితాంతం చిత్తు చేయడానికి ఆవిర్భవించిన ఆధునిక మద్యం తయారీ సంస్థల లాభార్జనలకి నిరసనగా, వాటినే నమ్ముకుని ముందుకు నడుస్తూ "యువత తప్పుదారి పడితేనే తమకి భవిత" అని అనుకుంటున్న

ప్రభుత్వ విధానాలకి వ్యతిరేకంగా ఒక బలమైన ప్రణాళికతో కూడిన మద్యపాన వ్యతిరేక ప్రచారోద్యమాన్ని నిర్వహించాల్సిన చారిత్రక కర్తవ్యం మనమీదుంది. ఆంధ్రదేశాన్ని అట్టుడికించిన దూబగుంట మహోద్యమాన్ని స్ఫూర్తిగా తీసుకొని జిల్లా స్థాయి ప్రచారోద్యమానికి నాంది ప్రస్థావన చేయడం జరుగుతోంది. ఈ రోజు ప్రతీ సగటు పౌరుడు ఎదుర్కొంటున్న సమస్యల్లో మద్యం ముఖ్యమైనది. ఏ ఒక్క వ్యక్తివలనో, ఏ ఒక్క పార్టీ ప్రోద్బలం వలనో మద్యంపై పోరాటం సాధ్యం కాదు. ఇది సమిష్టి ప్రయత్నం వల్ల మాత్రమే సుసాధ్యం. అందుకే ఈ అంశంలో అన్ని పక్షాల అభిప్రాయాల్ని సాదరంగా ఆహ్వానిస్తున్నాం. అలాగే ఇప్పటికే సంబంధిత సమస్యపై పోరాటం చేస్తున్న వాళ్ళు ఈ సరికే చేసిన వాళ్ళని సైతం ఈ కృషిలో భాగం అవమని కోరుతున్నాం. నేడు మద్యం ఒక మహావృక్షం. అత్యధిక శాతం ప్రజలపై ఈ విషవృక్ష ప్రభావం ఉందనేది నిస్సందేహం. కావున ఈ విషయంలో తక్షణ ఫలితాన్ని ఆశించడం అత్యాసే అవుతుంది. సామాజిక కార్యకర్తలు, స్వచ్ఛంద సంస్థలు, రాజకీయ పార్టీలు ఈ నిజాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ ప్రయత్నంలో పాలుపంచుకోగలరని ఆశిస్తున్నాం.

## ప్రధాన డిమాండ్స్

- ✤ సంపూర్ణ మద్యపాన నిషేధం దిశగా ప్రభుత్వం వెనువెంటనే చర్యలు చేపట్టాలి.
- ✤ గ్రామాల్లోనూ, పట్టణాల్లోనూ కూడా అక్రమ మద్యపాన దుకాణాలు, బెల్టు షాపులపై చర్యలు తీసుకోవాలి.
- ✤ బహిరంగ మద్యపానాన్ని సాంఘికనేరంగా ప్రకటిస్తూ, ధూమపానంలాగానే మద్యపానానికి గానూ జరిమానా విధించాలి.
- + ప్రాథమిక విద్యార్థి దశలోనే మద్యపానం వల్ల కలిగే అనార్థాలను విద్యార్థులకు తెలిపేలా చర్యలు తీసుకోవాలి.



- + అదే విధంగా అన్ని ప్రభుత్వ, ప్రైవేటు కళాశాలల్లోనూ మద్యపాన వ్యతిరేక ప్రచారోద్యమాన్ని ప్రభుత్వమే నిర్వహించాలి.
- ✤ గ్రామీణ ప్రాంతాలలో కల్లు, సారా వ్యాపారాన్ని పూర్తిగా తుడిచిపెట్టేలా చర్యలు తీసుకోవాలి.
- ✤ గ్రామాల్లోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో మద్యపాన అనార్థాలను తెలిపే కౌన్సిలింగ్ సెంటర్లను ఏర్పాటు చేయాలి.
- ✤ గ్రామ పంచాయితీ కార్యాలయాల్లోనూ, రచ్చబండల వద్ద కనీసం నెలకొకసారి మద్యపాన వ్యతిరేక కార్యక్రమాన్ని ప్రభుత్వ వైద్యుల ఆధ్వర్యంలో నిర్వహించాలి.
- ✤ మద్యపాన వ్యతిరేకోద్యమంలో ఈ సరికే కృషిచేస్తున్న స్వచ్ఛంద సంస్థల సహకారంతో శాశ్వత మద్యరహిత వ్యవస్థకిగాను అవసరమైన ప్రణాళిక ప్రభుత్వం యుద్ధ ప్రాతిపదికన రూపొందించాలి.
- ✤ అన్ని ప్రభుత్వ ప్రైవేటు ఆసుపత్రుల్లోనూ, పాఠశాలల్లోనూ, కళాశాలల్లోను, ఇతర బహిరంగ ప్రదేశాలలో, మద్యపాన అనర్థాల్ని గురించి అవగాహన పెంచే హోర్డింగులను ప్రభుత్వం ఏర్పాటు చేయాలి.
- ✤ మద్యపాన వ్యతిరేక ప్రచారోద్యమాన్ని విస్తృతంగా ప్రజానీకంలోకి తీసుకెళ్ళేందుకుగానూ, ప్రభుత్వం, ప్రకటనలు, లఘు చిత్రాలు నిర్మించి ప్రసారమాధ్యమాల్లో విరివిగా ప్రచారం చేయాలి.



# 3. బలవుదామా? బాగుపడదామా?!

**బలమే జీవితం, బలహీనతయే మరణం - స్వామి వివేకానంద**

మిత్రులారా !

మొన్న...... నిన్న...... నేడు.... రేపు కూడా .............!?

సారా, బ్రాందీలు మన జీవితాలను నాశనం చేస్తూనే ఉన్నాయి. సమస్యలు మనకు కొత్త కాదు. ఒకే సమస్య పలుమార్లు పునరావృత్తమైతే! అది సమస్య కాదు. సవాలే! సమస్య తలెత్తినప్పుడే లోపాలు, తాత్కాలిక పరిష్కారాలు అన్వేషిస్తాం తప్ప అసలు మూలమెక్కడో కనుక్కోవడానికి, శాశ్వత పరిష్కారానికి ప్రయత్నించిన దాఖలాలు లేవు.

సారా, బ్రాందీలు సేవించడం వల్ల సంవత్సరంలో ఎంతమంది చనిపోతున్నారో, ఎంతమంది పిల్లలు అనాథలవుతున్నారో ఇంకా ఎంత డబ్బు వైద్యానికి ఖర్చు చేస్తున్నారో మనకి తెలియంది కాదు. అయినా మనం గాని, ప్రభుత్వం గాని పట్టించుకోవడం లేదు. ఇది తొలిసారి కాదు. గతంలో ఇలాంటివి ఎన్నో...! ఈ సమస్య పునరావృత్తం కాకూడదంటే ఏమి చేయాలి? ఒకే ఒక సమాధానం, మద్యం త్రాగడం మానేయడమే.

## మద్యపానం అంటే ఏమిటి?

**మత్తును కలిగించే సారాయి, గుడుంబా, కల్లు, బ్రాందీ, విస్కీ, రమ్ము, జిన్, వైన్, బీర్, ఆల్కహాల్ మొదలైన పానీయాలను త్రాగడం.**

## మద్యం త్రాగితే ఏమవుతుంది?

- సారా త్రాగితే ఆ రోజే చనిపోతే, సారాయి, బ్రాందీలు త్రాగి చచ్చి, చచ్చి చనిపోతారు. వారి కుటుంబాలు వీధిన పడతాయి.
- గుండె పెద్దదవడం, కాలేయం, అన్నవాహిక కేన్సర్ లాంటి భయానక వ్యాధులు వస్తాయి. లక్షలు ఖర్చు చేసినా నయంకావు.



- మగతనం క్షీణించి ముసలితనం త్వరగా అవహిస్తుంది. పరపతి నశిస్తుంది.
- సిరోసిస్ ఆఫ్ లివర్ (బానపొట్ట) వస్తుంది. బుద్ధి మాంద్యం, పిచ్చి చేష్టలు వస్తాయి. వావి వరుసలు లేకుండా స్త్రీలను హింస పెడతాయి.
- ఆలోచనా శక్తి, విచక్షణా జ్ఞానం, సంస్కారం నశించి కొట్లాటలకు, హత్యలకు దారితీస్తాయి.

## మనం ఏం చేయాలి

- త్రాగిన వ్యక్తితో మాట్లాడకుండా ఉండడం.
- జనం మధ్య ఉన్న త్రాగిన వ్యక్తిని బయటకు పంపివేయడం.
- పోలీస్ వారు త్రాగిన వ్యక్తిని అదుపులోనికి తీసుకోవడం.
- త్రాగిన వ్యక్తులను బస్సు/రైలు మొదలైన వాహనాలలోనికి ప్రయాణికులు ఎక్కకుండా చేయడం.
- ఆ త్రాగిన వ్యక్తి డ్రైవర్‌గా ఉన్న ఆటో/రిక్షా ఎక్కడం మానేయడం.
- మహిళలు త్రాగిన తమ కుటుంబ సభ్యులను ఇంటిలోకి రాకుండా చేయడం.
- త్రాగిన వ్యక్తికి హోటల్/రెస్టారెంట్‌లోనికి అనుమతి నిరాకరించడం.
- ప్రతీ ఒక్కరం కనీసం ఒక్కరికి కౌన్సిలింగ్ యిచ్చి మద్యం మాన్పించడానికి ప్రయత్నించడం.
- టీచర్లు, విద్యార్థులకు మద్యం అనర్థాలను తరుచుగా చెప్పడం, వారిచే మద్యపాన వ్యతిరేక ర్యాలీలు నిర్వహించడం.

**"అలవాట్లు అబ్బడం మన చేతులలోనే ఉంది.**
**ఎలాంటి అలవాట్లు ఏర్పరచుకుంటే అలా తయారవుతాము"**

**- జవహర్‌లాల్ నెహ్రూ**

# 4. మద్యపాన వ్యతిరేక ఉద్యమంలో భాగస్వాములు కండి ఆరోగ్యకర సమాజ స్థాపనకు సహకరించండి.

మిత్రులారా !

నేడు మన సమాజంలో మద్యపానం అంటు రోగంలా వ్యాపిస్తోంది. కోట్లాది మంది మద్యపానానికి బానిసలై ఆరోగ్యాన్ని, జీవితాలను నాశనం చేసుకుంటున్నారు. అకాల మరణం కారణంగా ఎన్నో కుటుంబాలు రోడ్డున పడుతున్నాయి. మనదేశంలో సంవత్సరానికి లక్షల మంది మద్యపానం వలన సంభవించే వ్యాధులు కారణంగా మరణిస్తున్నట్లు ఆర్థిక సహకారాభివృద్ధి సంస్థ గణాంకాలు చెబుతున్నాయి. అలాగే దేశంలో జరుగుతున్న రోడ్డు ప్రమాదాలలో 70% మద్యం సేవించి వాహనాలు నడపడం వలన జరుగుతున్నాయని జాతీయ గణాంకాలు తెలియజేస్తున్నాయి.

మన రాష్ట్రంలో మద్యం ఏరులై పారుతోంది. ప్రభుత్వం మద్యం అమ్మకాలను యథేచ్ఛగా ప్రోత్సహించడం దురదృష్టకరం, మద్యాన్ని ఆదాయ వనరుగా పరిగణించడం అత్యంత శోచనీయం. మద్యం అమ్మకాల ద్వారా 2015 - 16 ఆర్థిక సం.లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి 12,759 కోట్లు ఆదాయం రాగా మద్యం వ్యాపారులు, దళారులు, కొంతమంది అధికారులు, రాజకీయ నాయకులు కలసి రెండు రెట్లు 'అక్రమార్జన చేస్తున్నారు. దీనిని బట్టి ప్రజలు మద్యపానానికి ఎలా బానిసలయ్యారో అర్థం చేసుకోవచ్చు.

## మద్యపానం ఎంత మాత్రం నాగరికతకు చిహ్నం కారాదు

- మద్యపానాన్ని నాగరికతా చిహ్నంగా పరిగణిస్తున్న కార్పోరేట్ వ్యాపార విష సంస్కృతిని గుర్తించాలి.
- సాంఘిక బహిష్కారానికి గురికావల్సిన మద్యపానం సామాజిక హెూదాకి చిహ్నంగా మారడం మన దౌర్భాగ్యం..



- మద్యాన్ని అధికంగా సేవించే దేశాలలో భారతదేశం 3వ స్థానంలో ఉంది.
- ప్రపంచంలో సరాసరి మద్యపానం 6.2 లీటర్లు కాగా, మన రాష్ట్రంలోని గ్రామీణ ప్రాంతాలలో 12 లీటర్లుగా గణాంకాలు పేర్కొంటున్నాయి.
- 1992-2012 మధ్యకాలంలో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్లో మద్యపానం చేసే వారి సంఖ్య 35% నుండి 50% పెరిగింది.
- మద్యపానం కారణంగా సగటు భారతీయుని ఆయుష్షు 4 సం॥లు క్షీణిస్తుంది.
- దేశంలోని శాంతి భద్రతల సమస్యలకు, మహిళలపై అత్యాచారాలకు మద్యం ఒక ప్రధాన కారణం.
- దేశంలో నిరుపేదల సంఖ్య పెరగడానికి మద్యపాన వ్యసనం ఒక కారణం.

## మద్యపానం ఆరోగ్యానికి చేటు - మద్యపాన వ్యసనం కారణంగా...

- కాలేయం (లివర్) దెబ్బతిని సిరోసిస్ వ్యాధితో అకాల మరణం సంభవించవచ్చు.
- గుండె కండరం దెబ్బతిని, గుండె వ్యాకోచంతో మరణించవచ్చు.
- ప్రేగులలో పుండ్లు పడి క్యాన్సర్కు దారి తీయవచ్చు.
- నరాల బలహీనతతో పాటు, లైంగిక సమస్యలకు దారి తీస్తుంది.
- మెదడు నరాలు దెబ్బతిని మానసిక వ్యాధులతో ఆత్మహత్యలకు పాల్పడవచ్చు.

## మద్యం అమ్మకాలను ప్రభుత్వం నియంత్రించాలి

- మద్యం అమ్మకాలను ప్రభుత్వం ఆదాయ వనరుగా పరిగణించరాదు.
- ప్రపంచ ఆరోగ్య సంస్థ సూచించిన విధంగా ప్రభుత్వం మద్యం అమ్మకాలను నియంత్రిస్తూ మద్యం వాడకాన్ని తగ్గించాలి.
- ధూమపానం తరహాలో బహిరంగ మద్యపానాన్ని సాంఘిక నేరంగా పరిగణించి జరిమానా విధించాలి.

- ప్రభుత్వం మద్యపాన దుష్ఫలితాల పట్ల పత్రికలు, ప్రచార సాధనాల ద్వారా విస్తృత ప్రచారం చేసి, ప్రజలను చైతన్య పరచాలి.
- పిన్న వయస్సు నుండే పిల్లలకు పాఠ్యాంశాల ద్వారా మద్యపాన అనర్థాల పట్ల అవగాహన కల్పించాలి.
- ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, ఏరియా ఆసుపత్రుల యందు మద్యపాన దుష్ఫలితాల పట్ల ప్రజలలో అవగాహన కల్పించుటకు కౌన్సింగ్ కేంద్రాలు ఏర్పాటు చేయాలి.
- జిల్లా కేంద్రాలలోని "డి-ఎడిక్షన్ సెంటర్"లను పటిష్టం చేసి, డివిజన్ కేంద్రాలకు విస్తరించాలి.
- ప్రభుత్వ హామీ మేరకు బెల్టు షాపులను మూసివేయాలి.
- జనావాసాలు, విద్యాలయాలు, దేవాలయాలు, జాతీయ రహదారులకు సమీపంలో మద్యం దుకాణాల నిషేధాన్ని కఠినంగా అమలు చేయాలి.
- గుజరాత్, బీహార్, కేరళ ప్రభుత్వాల తరహాలో మద్యనిషేధం దిశగా ప్రభుత్వం చర్యలు చేపట్టాలి.

**మహాత్మాగాంధీ కలలు గన్న మద్య రహిత సమాజాన్ని నిర్మిద్దాం.**

సమాజంలోని విజ్ఞానవంతులు, సామాజికవేత్తలు, ప్రజా సంఘాలు మద్యపానానికి వ్యతిరేకంగా ప్రజలను చైతన్య పరచాలి. మహాత్మాగాంధీ కలలు గన్న మద్యరహిత సమాజ నిర్మాణానికి పూనుకోవాలి.

**రండి... చేయి చేయి కలుపుదాం...**

**మద్యపాన రహిత సమాజాన్ని నిర్మిద్దాం....**





# 5. మద్యపాన విధ్వంసాన్ని ఎదిరిద్దాం

తాగడమనేది నాగరికతకి ప్రధానమైన అర్హతగా చూడబడుతున్న సమాజంలో తాగకపోవడం అనాగరికతకి ప్రమాణమైంది. ఒళ్ళొంచడానికి సిగ్గుపడే మధ్యతరగతి జనాల నుంచి రెక్కలు ముక్కలు చేస్తేగాని మెతుకురాని కష్టజీవుల వరకూ అందరూ మద్యం దుకాణాల్ని మౌనంగా పెంచి పోషిస్తున్నారు. తాగుబోతు లక్షణాన్ని విలక్షణంగా చూపిస్తున్న ప్రసారమాధ్యమాల ప్రభావంతో విద్యార్థులు, యువత కౌమారదశలోనే ఈ నాగరిక రోగం బారినపడుతున్నారు. వాస్తవ దృష్టిలేని వ్యవస్థ అవాస్తవికతని ఆరాధించడానికే మొగ్గు చూపుతుంది. అందులో భాగంగానే ఎక్కువమంది ప్రజలకి పనికొచ్చే కనీసవశరాల్ని కల్పించలేని ప్రభుత్వం, పనికిరాని విలాసాల్ని ఆకర్షణీయంగా వారిపై రుద్దడం ద్వారా సంఘంలోని అసమానతల్ని ప్రజలెప్పటికీ గుర్తించకుండా మభ్యపెడుతోంది. నిర్బంధవిద్యకి నీళ్ళొదిలేసి, ప్రభుత్వ వైద్యాన్ని పడకన పడేసిన పాలకులు, నాణ్యమైన విద్యా-వైద్యాల్ని కార్పొరేట్ సంస్థలకు టోకుగా అమ్మేసుకున్నారు. నిత్యావసరాల ధరలు, నిరుద్యోగుల సంఖ్య విపరీతంగా పెరిగినా పట్టించుకోకుండా ఉండాలనే మందిపై మద్యం పోస్తున్నారు. అత్యధికశాతం రోగాలు, నేరాలు, రోడ్డు ప్రమాదాలే కాకుండా, దళిత బహుజనులపై, స్త్రీలపై పిల్లలపై అత్యాచారాలు కూడా మద్యం కారణంగానే జరుగుతున్నాయి. మహిళల్ని కించపర్చడమే 'మగతనం'గా భావించే సంస్కృతిలో పాలకవర్గం నుండి వేరయి ప్రత్యేక పురుషాధిక్యతనేది వుండదు. మగాళ్ళ తాగుడు కారణంగా కుప్పకూలిపోతున్న లెక్కలేనన్ని నిరుపేద కుటుంబాల్లోని స్త్రీలు, పిల్లల పరిస్థితి చెప్పలేనంత దుర్భరంగా వుంటోంది. డబ్బుల కోసం ప్రమాదకరమయిన మాదక ద్రవ్యాల్ని దొంగచాటుగా అమ్ముకునే అక్రమ వ్యాపారులతో పోల్చిచూస్తే, ఆదాయం కోసం వినాశకరమయిన మద్యాన్ని బహిరంగంగా అమ్ముకునే అధికార నాయకులెంత పెద్ద నేరస్తులో అర్థమౌతుంది. ఒకవైపు మద్యంతో జనజీవితాల్ని అతలాకుతలం చేస్తూ, మరోవైపు,

సంక్షేమ కార్యక్రమాలతో అదే జనాన్ని అభివృద్ధి చేస్తామనటం ఏలినవారి రెండు నాల్కల ధోరణికి తిరుగులేని నిదర్శనం. ప్రజాస్వామ్య ఔన్నత్యం అందులోని పౌరులెంత చైతన్యవంతులనే విషయాన్ని ప్రామాణికంగా తీసుకుని బేరీజు వేయాలే కాని, ఎంతమందిని మత్తులో ముంచి ఎంతాదాయం రాబట్టామనే వ్యాపార సూత్రంతో కాదు.

బూతు ప్రసారాలతో, రోత సంస్కృతితో నేటితరం బుర్రల్ని పాడుచేసి వార్ని భావబానిసల్ని చేయడం విద్వేషశక్తుల విషలక్ష్యం. ప్రజానీకాన్ని మత్తుకి దాసుల్ని చేసి నిలువుదోపిడీ చేస్తున్న ఈ నయానియంతలని ఎదురుకోవడం ప్రజాస్వామిక విలువల్ని ఆశించేవారందరి కర్తవ్యం. అందుకే, మద్యపాన విధ్వంసాన్ని సమిష్టిగా ఎదిరిద్దాం. ఈ నిషాని నిషేధించేంత వరకూ అవిరామంగా గళమెత్తి పోరాడుదాం. భావితరాల వారికైనా ఆరోగ్యకరమయిన వ్యవస్థని వారసత్వంగా అందిద్దాం.





# 6. సంపూర్ణ మద్యపాన నిషేధాన్ని తక్షణం అమలు చేయాలి

మద్యం మన వ్యవస్థకి దాపురించిన వినాశకర సమస్య. సమాజంలో దినదినానికి దిగజారిపోతున్న నైతిక విలువలకు, క్షణక్షణానికి క్షీణించిపోతున్న మానవ సంబంధాలకూ మద్యమే ముఖ్య కారణం. సమాజంలోని భయంకరమయిన రోగాలకు, రోడ్డు ప్రమాదాలకు, స్త్రీలపై జరుగుతున్న నేరాలకు, మత్తు కారణంగా యువత పాల్పడే ఘోరాలకు మద్యమే ప్రధానం. ఈ వ్యసనానికి బానిసలై బతుకుల్ని చేజేతులా మంటగలుపుకుంటున్నవారి వల్ల కూలిపోయిన కుటుంబాలు, ఆగిపోయిన చదువులు, వీగిపోయిన జీవితాలకు లెక్కేలేదు. అన్యాయాన్ని నేరంగాకాక ఆదాయంగా చూడ్డం అలవాటైన సమాజం అక్రమార్జనని ఆర్థిక సుస్థిరతగా భ్రమిస్తుంది. తన ఖజానా నింపుకోవడం కోసం మందిచేత మద్యం తాగించడం అమానుషం. మన దేశంలో, రాష్ట్రంలో ఈ అఘాయిత్యం ప్రభుత్వాల చేత అధికారికంగానే అమలు చేయబడుతుంది. ఒక పక్క సామాన్యుల్ని నాశనం చేసే మద్యపానాన్ని పరోక్షంగా ప్రోత్సహిస్తూ, మరో పక్క వారి అభివృద్ధి కోసం సంక్షేమ పథకాల్ని ప్రవేశపెట్టే పాలకుల ద్వంద్వ వైఖరికి వర్తమాన వ్యవస్థని మించిన ఉదాహరణ మరోటి లేదు. ప్రజల బలహీనతని ఆసరాగా తీసుకుని బడుగుల బతుకుల్ని బుగ్గిపాలు చేసే వ్యసనాల్ని ఆర్థిక సౌలభ్యం పేరుతో చట్టబద్ధంగా సమర్థించుకోడాన్ని మించిన సిగ్గుమాలినతనం ఇంకోటి లేదు.

మద్య నిషేధానికి సంబంధించిన చర్చ వ్యవస్థలో ఎప్పుడు తలెత్తినా వీలైనన్ని వేషాలేసి దాన్ని తెలివిగా పక్కదారి పట్టించే ప్రయత్నాలు విజయవంతంగా జరుగుతుంటాయి కాబట్టే, ఈరోజు మద్య నిషేధమనేదొక అసాధ్యమైన విషయంగా మనకి కనబడుతోంది. దేశంలోనే ఎక్కువ శాతం మద్యాన్ని వినియోగించే పౌరుగు

రాష్ట్రమైన కేరళలో మద్య నిషేధాన్ని ప్రకటిస్తే, ఇక్కడది సాధ్యం కాదంటూ ప్రభుత్వం సాకులు చెబుతోందంటే, మన రాష్ట్రం ఈ మత్తులో ఎంత లోతుగా కూరుకు పోయిందో అర్థం చేసుకోవచ్చు. నిషేధం వలన పక్క రాష్ట్రాల నుండి అక్రమ మద్యం రవాణా అవుతుందనీ, సారాయి, ఇతర ప్రమాదకర మాదక ద్రవ్యాల వాడకం పెరిగిపోతుందనీ, హఠాత్తుగా నిషేధించడం వల్ల ఈసరికే వ్యసనపరులైన వారికి ఆరోగ్య సమస్యలొస్తాయనే కారణాల్ని ప్రభుత్వం చెబుతోంది. ఇవన్నీ బొత్తిగా శుద్ధ అవాస్తవాలని ఎవరూ కొట్టిపారేయరు కానీ, నిజంగా నివారించాలనే చిత్తశుద్ధుంటే 'ఇవన్నీ పాలక యంత్రాంగం పరిష్కరించలేనంత గొప్ప సమస్యలు కావేమో ఆలోచించాలి. ఈ అంశంపై ఈసరికే జరిగిన కృషిని, అధ్యయనాల్ని పరిశీలించడం ద్వారా, ఈ సమస్యపై ఎంతోకాలంగా పనిచేస్తున్న సామాజిక స్వచ్ఛంద సంస్థల అనుభవాల్ని, కమిటీ నివేదికల్ని బేరీజు వేయడం వల్లా ఈ విషయంలో అనుసరించాల్సిన వైఖరిపై స్పష్టత ఏర్పర్చుకోవచ్చునని గుర్తించాలి.

చట్టవిరుద్ధమైన బెల్టు షాపుల్ని చట్టబద్ధంగా తొలగిస్తామనే హాస్యాస్పద వాగ్దానాన్ని ఆడంబరంగా చేసి అట్టహాసంగా అధికారంలోకొచ్చిన ప్రభుత్వం ఆచరణలో దారుణంగా విఫలమైంది. అందుకే, అడుగడుగునా ఈ గొలుసు దుకాణాలు నిబంధనలకు విరుద్ధంగా నడుస్తూ మామూలు ధరకంటే ఎన్నోరెట్లు ఎక్కువ సొమ్ము వసూలు చేస్తూ జనాల్ని అడ్డంగా లూటీ చేస్తున్నాయి. ఆమ్యామ్యాలకలవాటుపడ్డ ఆబ్కారీశాఖ అప్పుడప్పుడు గ్రామాల్లోని అమాయకులపై దండెత్తి నాటుసారా బట్టీల్ని పగులకొట్టి పత్రికలకెక్కడంలో చూపే ఆసక్తి, బ్రాందీషాపుల అక్రమాలని అరికట్టడంలో చూపకపోవడంతో మద్యం దందాలు యధేచ్ఛగా పెరిగిపోతున్నాయి. ప్రజల ప్రాణాలతో చెలగాటమాడే వ్యసనాలపై



ఆధారపడి ప్రభుత్వాలు ఆదాయాల్ని సమకూర్చుకోవడం ప్రజాస్వామ్యానికే కళంకం. పేదల జీవితాల్ని మొదలుకంటా చిదిమేసేలా తాగుబోతుల్ని పోషించడం ఆధునికతకే అత్యంత అవమానకరం. బాలకార్మిక వ్యవస్థ మొదలుకుని స్త్రీలపై బలాత్కారాల దాకా సంఘంలో అసాంఘిక కార్యక్రమాలన్నిటిలోనూ కనిపించేది అంతర్లీనంగా మద్యపానమనే వ్యసనమే. విద్యార్థులు, యువత, నిరుద్యోగులు, చిరుద్యోగులు, రైతుకూలీలు, రోజుకూలీలు, బడుగు వ్యాపారులు, బలహీనవర్గాలు... ఎందరో ఈ మద్యం బారిన పడి జీవచ్ఛవాల్లా బతుకీడుస్తున్నారు.

ఈ పరిస్థితి మారాలి. మనమందరం మద్యపాన సమస్యపై పెద్దఎత్తున స్పందించాలి. ఎక్కడికక్కడ స్థానిక మహిళల్లో సంఘటితమై పాలకుల కుటిల వైఖరిని నిరసిస్తూ పోరాడాలి. భవిష్యత్తులో మన పిల్లలైనా మద్యరహిత వ్యవస్థలో ఆరోగ్యకరంగా జీవించడానికి ఇప్పట్నుంచే మద్యాన్ని వెంటనే పూర్తిగా, శాశ్వతంగా నిషేధించమని ప్రభుత్వాన్ని డిమాండ్ చేయాలి. నాగరికతనేది మనుషుల్లో వుంటుందేకాని మత్తులో కాదని ప్రచారం చేయాలి. మనవీయ స్పృహతో బాధ్యతగా మనతరం ముందడుగేయాలి.



# 7. మద్యమా? మనుగడా ??

మిత్రమా !

"మద్యం మనోగాయాలు మాన్పే దివ్యౌషదం" అన్నారు మహాకవి ఆత్రేయ. ఆకాశంలోంచి చూచి "సమస్త భూమండలమంతా పురాతన పానశాల" గా వర్ణించారు. మద్యం మనిషి ఉదరకోశం, కాలేయం, మూత్రపిండాలు, మెదడులాంటి కీలక అవయవాలను నాశనం చేస్తుందంటారు డాక్టర్లు, రోడ్డు ప్రమాదాలలో ప్రధాన కారణం మద్యం సేవించడమే నంటారు భద్రతా అధికారులు, రక్షిత మంచినీరు, రహదారి లేని మారుమూల గ్రామాలకు సైతం మద్యం అమ్మకాలు విస్తరింపజేసి ప్రజల అవసరాలు తీరుస్తున్నామంటారు వ్యాపారులు, బెల్టు షాపుల్లో అనధికార అమ్మకాల వలన లంచాలు బాగా దొరుకుతాయని సంతోషించే అధికారగణం ఒక వైపు, మద్యాన్ని రాష్ట్ర బడ్జెట్‌లో గణనీయమైన ఆదాయ వనరుగా సంతృప్తి చెందే ప్రభుత్వం మరోవైపు ప్రజా సంక్షేమాన్ని విస్మరించాయి.

ప్రజా ఉద్యమం కారణంగా గతంలో పాలక రాజకీయ పార్టీలు మద్య నిషేధాన్ని కొన్ని రోజులలో అని ఒకరంటే మరొకరు కొన్ని గంటలలోనే అని పోటీలు పడి ప్రచారం చేశారు. నిజంగానే మొదటి గంటలో పెట్టిన నిషేధం రెండో గంటలో (ఎన్నికల తర్వాత) ఎత్తివేయటం జరిగింది. సంస్కరణల అభివృద్ధి (అధోగతి) నీడలో మద్యం మానవ అవసరంగా మార్చబడింది. బార్లు, రెస్టారెంట్లు, చాలక డిస్కోథెక్‌ల దాకా ఎగబ్రాకి తాగనివాడ్ని "సంస్కారహీనుడి"గా "హైక్లాస్ మర్యాదలు" తెలియని దీనుడిగా చూసే పరిస్థితి దాపురించింది. మానవ మనుగడను, ప్రభుత్వాలను శాసించే స్థితికి 'మద్యం' ఎదిగింది. ఇప్పుడు మన గమ్యం ఎటు వైపు !

**అందుకే రండి, మద్యరహిత సమాజ నిర్మాణానికి పూనుకుందాం !**



# 8."యువ మిత్రులారా ! ఇలాగేనా ! న్యూ ఇయర్ గ్రీటింగ్స్ చెప్పడం !"

ఒక్క క్షణం ఆలోచించండి. డిశంబర్ 31 వస్తోందంటే మీలో కొంతమందికి గ్లాసుల పులకరింత. మద్యం వ్యాపారులకు కాసుల పలవరింత. ఎందుకు? కొత్త సంవత్సరానికి స్వాగతం చెప్పడానికే గదా ! మన ఆశలూ ఆశయాలు వచ్చే ఏడాదైనా తీరుతాయనే విశ్వాసంతో కొత్త సంవత్సరానికి ఆహ్వానం పలకడం సహజమే!

కానీ బ్రాందీ, విస్కీలూ ఆ మత్తులో వేసే వెర్రి కేకలూ అరుపులూ మోటారు బైకుల మోతలూ ఇదా న్యూ ఇయర్ కి గ్రీటింగ్స్ చెప్పే పద్ధతి ! "ఏదో సరదాగా!" "ఫ్రెండ్స్ అందరితో పాటూ !" రోజూ చేస్తామేంటి! " న్యూ ఇయర్లో అందరికీ శుభం జరగాలని....." ఇవే కదా మిమ్మల్ని ఎవరైనా ప్రశ్నిస్తే వచ్చే సమాధానాలు. "సిరి అబ్బలేదు గాని చిదుం అంటుకుందన్నట్టు" శుభం మాట అటుంచి ఈ సరదా వ్యసనంగా మారిపోయి వామనుడి మూడో పాదంలా మిమ్మల్ని అధఃపాతాళంలోకి తొక్కేస్తుంది.

అందరికీ శకునం చెప్పే బల్లి కుడితి తొట్టెలో పడ్డట్టు కాస్తోకూస్తో ఆలోచించేవాళ్ళు "కుర్రాళ్ళకు అదో సరదా!" అంటూ "ఫుల్"గా వంత పాడుతున్నారు. ప్రభుత్వం కూడా అర్ధరాత్రి దాకా మద్యం అమ్మకాల్ని మన "సారా" అనుమతిస్తోంది. యువతకోసం బార్లు బార్ల తెరచి ఉంచుతోంది. మొగుణ్ణి చంపిన చేతులతోనే మనోవర్తి ఇచ్చినట్లు మద్యం రాబడితో సంక్షేమ కార్యక్రమాలు చేపడతానంటోంది. 'అనడమేంటి! ఆ మాటలనే 'బీరు' పోకుండా పాటిస్తోంది.

మిత్రులారా ! నష్టపోయేది మాత్రం రేపటి తరానికి ప్రతినిధులైన మీరే ! అందుకే ఈ సారి కొత్త సంవత్సరానికి కొత్తగా స్వాగతం చెప్పండి. న్యూ ఇయర్ గ్రీటింగ్స్ చెప్పే రోజంటే మూడు సీసాలూ ఆరుగ్లాసులుగా వర్ధిల్లే రోజుకాదని చాటండి. రాబోయే సంవత్సరం కోసం మీ బతుకుల్ని బాగు చేసుకొనే నిర్ణయాలు తీసుకోండి. కన్నోళ్ళ కళ్ళల్లో కన్నీళ్ళు రానివ్వబోమని ప్రతిజ్ఞ చేయండి. అలాగే సమాజం గురించి కాస్త పట్టించుకోండి. మంచి భవితకు బాటలు వేయండి. ఈ కరపత్రాన్ని పూర్తిగా చదివారంటే మంచి ఆలోచనలను మీరు స్వాగతిస్తున్నారని భావం. మంచి ఆలోచన అభ్యుదయానికి తొలిమెట్టు.

**నూతన సంవత్సర శుభాకాంక్షలతో**



అక్టోబర్ 2, 2017న రామచంద్రాపురంలో జరిగిన మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి అర్ధదశాబ్దుత్సవ కార్యక్రమంలో ప్రచురించిన సావనీర్ "మానవతకు భరోసా" ఆవిష్కరిస్తున్న విజ్ఞాన వేదిక, ప్రజాసంఘాల బాధ్యులు



# 9. కొత్త సంవత్సరానికి ఆహ్వానం ఇలా చెబుదామా !

యువ మిత్రులారా! దాచుకున్న కొత్త చొక్కా తొడుక్కోడానికి పండగెప్పుడొస్తుందా అని ఎదురుచూసే పేదింటి కుర్రాడిలా డిసెంబరు 31 రాత్రి కోసం ఆతృతగా ఎదురుచూస్తున్నారా!! హేపీ న్యూ ఇయర్ అంటే 'అర్ధం ఫ్రెండ్స్ తో కలిసి మద్యం సేవించడమా! ఒక్క క్షణం ఆలోచించండి. "పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నట్టు" డబ్బుతో పులిసిన వాళ్ళు కిక్ కోసం తాగుతుంటే దీపానికి ఆకర్షితులయ్యే పురుగుల్లా మీరు బలౌవుతున్నారు. పరీక్షపాసైన ఆనందంతో ఓ పెగ్గేస్తే తప్పేంటి? అని మొదలుపెట్టి ఉద్యోగం దొరికిందనో, ప్రమోషనొచ్చిందనో దాన్ని కంటిన్యూ చేస్తున్నారు. "కాళ్ళకు చుట్టుకున్న పాము కరవక మానదన్నట్టు" ఈ దిక్కుమాలిన అలవాటు మీ జీవితాలను విషాదం చేస్తుంది. "కొండచిలువ నోటిలో చిక్కుకున్న జింక తప్పించుకోగలదేమో కానీ మద్యం బారిన పడ్డ మనిషి బైటపడగలడా?" "చూస్తూ ఊరుకుంటే మేస్తూ పోయిందన్నట్లు" మద్యం ఆ మధ్య విజయవాడలో బంగారం లాంటి బ్రతుకుల్ని బుగ్గిపాలు చేసింది. "తల గొరిగించు కున్నాకా తిథి నక్షత్రం చూసుకున్నట్టు" కూలీల బతుకులు కూలిపోయాకా ఎంక్వైరీలు కమిటీలూ, సస్పెన్షన్లూ మొసలి కన్నీళ్ళ హడావిడి. "స్మశాన వైరాగ్యం వసారా వరకే" అన్నట్టు కొద్ది రోజులు గడిచాకా అన్నీ ష(సా)రా మామూలే. అందుకే ఇప్పటికైనా మేలుకోండి.

కొత్త సంవత్సరం వస్తోందంటే శుభాలను తెస్తుందని ఆశించడంలో తప్పులేదు. కానీ అర్ధరాత్రి ఉన్మాదంతో చెవులు బద్దలయ్యేలా అరుపులూ మద్యం మత్తులో చిందులూనా? ఇదా కొత్త సంవత్సరానికి స్వాగతం చెప్పే పద్ధతి? దీనివల్ల మద్యం వ్యాపారుల జేబులు నిండుతాయి. మధ్యతరగతి జీవుల జేబులు ఖాళీ అవుతాయి. ఇంతకంటే ఒరిగేదేమిటి? ప్రజల ఆరోగ్యాలకు హామీ ఇవ్వాల్సిన ప్రభుత్వాలే "బంధువుల విందు కోసం తల్లిని పస్తులుంచినట్టు" మందిని మద్యం మత్తులో తూగమని ఆ డబ్బుతో సంక్షేమ పథకాలను చేపడతానంటున్నాయి.

ఈ కొత్త సంవత్సరం సందర్భంగా మీ జీవితాల్లో వెలుగునింపే మీ కన్న వాళ్ళు గర్వపడే ఓ మంచిపనికి శ్రీకారం చుట్టండి. "ఈ రోజు నుంచీ మద్యం జోలికిపోను" అని ఓ గట్టి నిర్ణయం తీసుకోండి. అదే కొత్త సంవత్సరానికి నిజమైన ఆహ్వానం.

**తల్లిదండ్రులకు విజ్ఞప్తి :** ప్రియమైన తల్లిదండ్రులారా! ఈనాడు మీరు కంటిపాపలుగా చూసుకుంటున్న మీ వారసులు రేపు మిమ్మల్ని కంటతడి పెట్టించకుండా ఉండాలంటే డిసెంబరు 31వ తేది అర్ధరాత్రి మందు పార్టీలకి వెళ్ళకుండా చూడండి. ఇది మీ కనీస బాధ్యత.




2016, అక్టోబర్ లో హైదరాబాద్ లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో నషాముక్తి ఆందోళన్ యాత్రలో భాగంగా వివిధ ప్రజా సంఘాల ఆధ్వర్యంలో ప్రముఖ సామాజికవేత్త మేధా పాట్కర్ ఆవిష్కరించిన మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి ప్రచురించిన, "మద్యపానమా? మానవత్వమా??" మద్య వ్యతిరేక మహిళా వ్యాస సంకలనం.



# 10. మహిళా! మద్యం మీద తిరగబడు !!

యశోదకి సర్వలోకాలూ కృష్ణుడి నోట్లో కనిపించాయట. అది భాగవతం. మనకు సకల అనర్ధాల వెనకా మద్యం కనిపిస్తోంది. ఇది నేటి భారతం. అగ్గి ఎంత స్వచ్ఛమైనదైనా ఇనుముతో చేరాక సమ్మెట దెబ్బలు తప్పనట్టు అమాయకురాలైన ఆడవాళ్ళకి తాగుబోతు భర్తలచేత తన్నులు తప్పడం లేదు. శ్మశానంలో అందరూ సమానమే అంటారు. తాగితే చిన్నా పెద్దా, బీదా బిక్కీ అంతా సమానమే. తాగి ఇంటికొచ్చిన వాడికి చెలికి, చెల్లికీ తేడా తెలియదు. తల్లికి తోబుట్టువుకీ భేదం కనిపించదు! ఆడది అర్ధరాత్రి ఒంటరిగా తిరిగే రోజు రావాలన్నారట గాంధీజీ. అర్ధరాత్రి ఎందుకు? పట్టపగలే కాలేజీకెళ్ళిన ఆడపిల్ల ఏ తాగుబోతు బారిన పడకుండా ఇల్లుచేరుతుందనే నమ్మకం తల్లిదండ్రులకు ఉండటంలేదు. కూతురి కాపురం కళకళలాడుతూ ఉండాలని ఉన్నదంతా ఊడ్చి పెళ్ళి చేసిన తండ్రి చివరికి ఆలి కూతురి జీవితం వడ్డించిన విస్తరి కాకపోయినా పర్వాలేదు. కుక్కలు చింపిన విస్తరి కాకుండా ఉంటే చాలు దేవుడా! అని వాపోతున్నాడు. 'స్త్రీ శక్తి స్వరూపిణి", స్త్రీ ఆదిశక్తి" అని పురాణాల్లో రాశారు. తాగుబోతు భర్తల బారినపడి నేడు ఆ ఆదిశక్తులు ఆర్తనాదాలు చేస్తున్నారు. పక్షి కంట కన్నీరు చూసి కిరాతకుడు చలించిపోయాడు. అది రామాయణం. నేడు మద్యం మత్తులో ఉన్న కిరాతకులకు పాలుతాగే పసిపాపలను చూసినా పాపిష్టి ఆలోచనలే కలుగుతున్నాయి. ఇది ఆధునిక భారతం.

ఆవు చేలో మేస్తే దూడ గట్టున మేస్తుందా? పిల్లలకు ఆదర్శంగా ఉండాల్సిన పెద్దలు గ్లాసుల మత్తులో జోగుతుంటే క్లాసుల్లో ఉండాల్సిన పిల్లలు మందుబాటిళ్ళతో ఊగుతున్నారు. తాగిన మత్తులో బైకుల్ని ఇష్టమొచ్చినట్లు నడుపుతున్నారు. ప్రతిరోజూ ఏ తల్లి కడుపో కాలిపోతూనే ఉంటుంది. ఏ కొత్త వధువో ఊసూరుమంటూనే ఉంటోంది. మద్యంతో స్వాగతం చెప్పకపోతే కొత్త సంవత్సరం రానంటుందేమో! డిశంబర్ 31 వస్తే చాలు తాగడానికి నీరు దొరకని ప్రాంతాల్లో కూడా బీరు ఏరులా ప్రవహిస్తుంది. పిల్లలతోబాటు రోడ్డుమీద వాళ్ళ బైకులు కూడా ఊగుతాయి. చెట్టంత కొడుకుపోయాక "ఏం చేస్తాం? వాడికి నూకలు చెల్లిపోయాయి" అని

వేదాంతం మాట్లాడేకంటే మద్యం బారి నుంచి ముందే వాళ్ళను కాపాడుకోవాలి. వైద్యుడి పేరు చెప్పినంత మాత్రాన రోగం పోనట్లే మీడియాలోనూ వీడియోల్లోనూ నీతులు వల్లించినంత మాత్రాన నడత మారదు. కన్న కొడుకైనా సరే మద్యం జోలికి వెళ్ళినట్లు తెలిస్తే దూబగుంట రోశమ్మను తలచుకుని గూబగుయ్ మనిపించాలి.

ఎన్ని చెప్పినా మేము తాగుడు మానలేము, మానము అని మొండిగా మాట్లాడే వాళ్ళను ఉద్దేశించి ఓ చాటుకవి కోపంతో చెప్పిన పద్యం చూడండి.

"కల్లుసార బ్రాంది కడుపార తాగరా
జంకు గొంకులేక పొంకముగను
ఏది దొరకనపుడు ఎండ్రిను తాగరా
విశ్వదాభిరామ వినురవేమ."




ది.02-10-2017 జాతిపిత మహాత్మాగాంధీ జయంతి పురస్కరించుకుని మద్యం నిషేధించాలని కోరుతూ పిఠాపురంలో జనవిజ్ఞాన వేదిక ఆధ్వర్యంలో ప్రదర్శన



# 11. "మందు" చూపు గల మిత్రులకు మహాత్ముని జయంతి సందర్భంగా విజ్ఞప్తి

మిత్రులారా,

ప్రతి ఏటా జాతిపిత గాంధీజీ జయంతిని జరుపుకుంటున్నాం. ఆయన మీద ఆయన సిద్ధాంతాల మీదా నిజంగా మీకు గౌరవం ఉంటే ఈ కరపత్రం చదవండి.

"మహా ఆనందం అంటే ఏమిటి? అని ప్రశ్నించి "కడుపు నిండా మద్యం, ముక్కు నిండా పొగా" అంటాడు మద్యం కొట్టతను కన్యాశుల్యం నాటకంలో. అతనిలాగే మీరు కూడా మద్యంలో మహదానందాన్ని వెతుక్కుంటున్నారు. వెనకటికి ఒకాయన తలపాగా మీద మోజుపడి మొలగోచీ పీకేసుకున్నాడట. అలా మీరు పార్టీల కోసం ఎగబడుతూ పిల్లాడి చదువు, ఎదిగొచ్చిన పిల్ల పెళ్ళి, సొంతగూడు వంటి ముఖ్యమైన విషయాలను పక్కన పెట్టేస్తున్నారు. పెళ్ళిచూపులు జరిగినా, పెళ్ళి కుదిరినా, పెళ్ళి జరిగినా పార్టీలే. పెళ్ళిముందు పార్టీ, పెళ్ళిరోజూ పెళ్ళి తర్వాతా కూడా పార్టీలే, పెద్దవాళ్ళతో పరిచయం పెంచుకోవాలన్నా, అనుకున్న పని జరగాలన్నా పార్టీ ఉండాల్సిందే. ఆలోచించండి మిత్రులారా కష్టపడుతున్నాం కులాసా చేస్తున్నాం. అని సమర్థించు కుంటున్నారు. కాని 'కన్నూ నాదే వేలూ నాదే" అని పొడుచుకుంటే పోయేది మీ కన్నే. అబ్బే మేం తాగేది నాటు కాదు నీటే అనే మిత్రులున్నారు. 'తలగడ మారిస్తే తలనొప్పి తగ్గుతుందా'! రేపు మీ వారసులు మీ అడుగు జాడల్లో నడవరనే గ్యారంటీ మీకుందా !

కనిపెంచిన వాళ్ళను కంటతడి పెట్టించకండి. కట్టుకున్న ఇల్లాలు, కడుపున పుట్టిన పిల్లలు ఉసూరు మనకుండా మీ అలవాటును వదులుకోండి. ఉపన్యాసాలు, విగ్రహాలకు పూలదండలూ, గాంధీగారి మీద పాటలు ఇవి మాత్రమే చాలదు. మద్యానికి దూరంగా ఉంటామని మహాత్ముడి జయంతి సందర్భంగా మంచి నిర్ణయం తీసుకోండి. అదే మీరాయనకిచ్చే నిజమైన నివాళి.

**సర్వేజనాస్సుఖినోభవంతు**

# 12. అమ్మలారా! అక్కలారా! ప్రియమైన చెల్లెళ్ళారా! ఒక్కసారి ఆలోచించండి

ఎన్నికలొస్తున్నాయి.. నాయకులకు ఎన్నెన్నో కలలొస్తున్నాయి. మద్యం వ్యాపారులకు కాసుల గలగలలు వినిపిస్తున్నాయి. మందుబాబులకు గ్లాసుల పులకరింతలు రాబోతున్నాయి. పూర్వం కరువు కాటకాలో, అంటురోగాలో ప్రజలను పీడించేవి. ఇప్పుడు మద్యపానం ఆ బాధ్యతను భుజాలకెత్తుకుంది. ''మాకు ఓటేయండి, మీ బతుకుల్ని బంగారం చేస్తాం" అంటూ వచ్చే నాయకుల్ని మద్యపానం గురించి అడిగే సందర్భం వచ్చింది.

'అన్న వస్త్రాలు కావాలి మహాప్రభో అని మొత్తుకుంటే ఉన్న వస్త్రాలు పీకేసినట్టు' మద్యం షాపులు తీయించమని అడుగుతుంటే పీకలదాకా షాపుల దగ్గరే తాగొచ్చని అనుమతిచ్చింది ప్రభుత్వం. రెక్కలు ముక్కలు చేసుకుంటే వచ్చే నాలుగు రాళ్ళతో తప్పతాగి ఇల్లూ ఒళ్ళూ గుల్ల చేసుకుంటున్నారు కష్టజీవులు, కన్నోళ్ళనూ, కట్టుకున్నోళ్ళనూ కన్నీళ్ళు పెట్టిస్తున్నారు. ఈసురోమని పిల్లలు అల్లాడుతున్నారు. మద్యం అమ్మకాలను ఎందుకు ప్రోత్సహిస్తున్నారు? అనడిగితే సంక్షేమ కార్యక్రమాల కోసం అంటున్నారు మంత్రులు. దూడల గడ్డి కోసం కొబ్బరిచెట్టు ఎక్కాలంటున్నారు. "కోడలు ముండమొయ్యాలి, కొడుకు చల్లగుండాలి" అన్నట్టు "మద్యం వ్యాపారంతో మస్తు సొమ్ములు రావాలి, మంచి సుఖ సంతోషాలతో కూడా ఉండాలి" అంటే ఎలా కుదురుతుంది? గోవును చంపి చెప్పులు దానం చేసినట్టు మీకు కానుకలిచ్చి ఓట్లు అడగడానికి నాయకులొస్తారు. "ఐదు రూపాయలు కలిసొస్తున్నాయని ఐదు తరాలకి సరిపడే ఆస్తిని తాకట్టు పెట్టినట్టు" తాయిలాలకు ఆశపడి అయిదేళ్ళ పదవిని కట్టబెట్టకండి. మద్యం షాపులు తీయించమనండి. సంపూర్ణ మద్యనిషేధం కోసం కృషి చేయమనండి. అలాంటి వారికే ఓటేస్తాం అని తెగేసి చెప్పండి.

మద్యం తాగి ఓటు వేయవచ్చా? దీనిని అరికట్టండి. ఈ కరపత్రాన్ని పూర్తిగా చదివారంటే మంచి ఆలోచనలను మీరు స్వాగతిస్తున్నారని భావం. మంచి ఆలోచన అభ్యుదయానికి తొలిమెట్టు.



# 13. మద్యపాన వ్యతిరేక ప్రచార తీర్మానం

## (జె.వి.వి. రాష్ట్ర మహాసభల్లో ప్రవేశపెట్టినది)

**నేపథ్యం:**

2012 అక్టోబర్ 2వ తేదీన జనవిజ్ఞాన వేదిక మిత్ర సంస్థగా ఏర్పడిన "మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి" నిరంతరం తన పరిధిని విస్తృతం చేసుకుంటోందని తెలియజేయడానికి ఆనందిస్తున్నాం. అర్థదశాబ్ద కాలంగా ఉభయ తెలుగు రాష్ట్రాలలో ఎన్నో మిత్ర సంఘాలతో కలిసి ఐక్య ఉద్యమ నిర్మాణానికి పనిచేయడమే కాక వేల సంఖ్యలో కరపత్రాలు ప్రచురిస్తూ సమావేశాలు, అవగాహనా తరగతులు నిర్వహిస్తోంది. దేశంలో మొట్టమొదట సోషలిస్టు సంఘం స్థాపించబడి 82 సం॥లు అయిన సందర్భముగా దేశవ్యాప్త సామాజిక కార్యకర్తలంతా పాల్గొన్న పాట్నా సభలో ఆంధ్రప్రదేశ్ తరపు నుండి పాల్గొనడమే కాక మద్యపానాన్ని నిషేధించిన బీహార్ ముఖ్యమంత్రి నితీష్‌కుమార్, సామాజికవేత్తలు మేధాపాట్కర్, జి.జి. పారిఖ్, సందీప్ పాండే, డా.సునీలం వంటి వారిని కలిసి భావాలు పంచుకోవడం జరిగింది. అలాగే ప్రకాష్ అంబేద్కర్, పన్నాలాల్ సురానా వంటి వారు పాల్గొన్న రాష్ట్ర సేవాదళ్ 75 సంవత్సరాల ఉత్సవ కార్యక్రమంలో పూణేలో తెలుగురాష్ట్రాల తరుపున పాల్గొని మద్యపాన వ్యతిరేకోద్యమ అభిప్రాయాల్ని పంచుకోవడం జరిగింది.

దేశవ్యాప్తంగా వామపక్ష ప్రగతిశీల ప్రజా సంఘాలన్నింటితోబాటు ఎన్.ఎ.పి.ఎమ్, నర్మదా బచావో ఆందోళన్, జన్ ఆందోళన్, ఖుదాయి కిద్మత్గార్ మొదలగు సంఘాలు, ప్రజా ఉద్యమాల జాతీయ వేదిక, సమాచారహక్కు ప్రచార ఐక్య వేదిక, సత్యాన్వేషణ మండలి, జనవిజ్ఞాన వేదిక, జనచైతన్య వేదిక, రైతు స్వరాజ్య వేదిక, మానవహక్కుల వేదిక, అనంతుడు ఫౌండేషన్, ఆమ్ ఆద్మీ, లోక్‌సత్తా, గాంధీ స్మారక సమితి, జై భారత్ వంటి వివిధ సంస్థలు ఈ అంశంలో బాసటగా నిలుస్తున్నాయి. చరిత్ర సృష్టించిన మహోజ్వల దూబగుంట పోరాట స్ఫూర్తిని వర్తమాన వ్యవస్థలో ప్రధానంగా విద్యార్థి, యువజన, స్త్రీలు ఎదుర్కొంటున్న మద్యపాన సమస్య తీవ్రతనూ గ్రహించి ప్రతీ ఒక్కరూ స్పందించాలని ఆశిస్తున్నాం.

## తీర్మానం:

ఈ మహాసభల నుండి రాబోయే మహాసభల వరకు జెవివి ఎంచుకున్న కార్యక్రమాల్లో మద్యపాన వ్యతిరేక ప్రచారానికి మరింత ప్రాధాన్యత కల్పించేలా ఈ మహాసభలలో తూర్పుగోదావరి జిల్లా కమిటి తీర్మానాన్ని ప్రవేశపెట్టడంతో పాటు, తీర్మాన అంశాలుగా ఈ క్రింది సూచనల్ని సభలో చర్చించాలి.

## తీర్మానాంశాలు :

1. సారా, బ్రాందీ, విస్కీ, బీరు, రమ్ము, జిన్ను.... మొదలైన వాటన్నింటినీ కలిపి అన్ని రకాల మాదక ద్రవ్యాలకీ "మద్యం" అనే పదాన్ని ఉపయోగించాలి.
2. అక్టోబర్ 2ని మద్యపాన వ్యతిరేక దినోత్సవంగా రాష్ట్ర వ్యాప్తంగా అధికారికంగా ప్రకటించేలా ప్రభుత్వంపై ఒత్తిడి తేవడంతో పాటు, జిల్లాలన్నింటిలో జె.వి.వి. విస్తృతంగా కార్యక్రమాలని చేపట్టడానికి ప్రయత్నించాలి.
3. నెలలో తప్పనిసరిగా ఒక రోజు హైస్కూలు, జూనియర్, డిగ్రీ, పిజి కళాశాలల్లో విద్యార్థులకి అవగాహన తరగతులను నిర్వహించాలి.
4. జాతీయ పర్వదినాలు, నూతన సంవత్సర వేడుకలలో విచ్చలవిడిగా ప్రవహించే మద్యానికి వ్యతిరేకంగా ప్రజల్లో చైతన్యం కలిగించడానికి ప్రయత్నించాలి.
5. మద్యం వలన జరిగే నేరాలు, ప్రమాదాలు పట్ల ప్రజలలో అప్రమత్తత కలుగజేయాలి.
6. అన్ని జెవివి యూనిట్లు మద్యపాన సమస్యపై సృజనాత్మక రీతిలో సొంతంగా కరపత్రాలు, పోస్టర్లు, బేనర్లు, వర్క్ షాపులు, సభలు నిర్వహించేలా నాయకత్వం ప్రోత్సహించాలి.



7. ఉభయ తెలుగు రాష్ట్రాల్లో అనేక ప్రాంతాల్లో అడపాదడపా జరుగుతున్న మద్యపాన వ్యతిరేక ఉద్యమాలకి సహకరించడమే కాక యువజన, మహిళా సంఘాలకు మద్దతివ్వాలి.
8. ప్రజల బలహీనతను ఆదాయ వనరుగా భావించే ప్రభుత్వాల అనాగరిక వైఖరిని ఎండగట్టడంతోబాటు మద్యపానాన్ని నాగరికతకు చిహ్నంగా భావిస్తున్న యువత ఆలోచనా విధానాన్ని మార్చగలగడమే మన ముందున్న తక్షణ కర్తవ్యంగా భావించాలి.

ఇట్లు

**మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి**



19-10-2017 మద్యపానానికి వ్యతిరేకంగా కొడవలి గ్రామంలో జనవిజ్ఞాన వేదిక, మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి ఆధ్వర్యంలో దిష్టిబొమ్మను దహనం చేస్తున్న దృశ్యం

# 14. మద్యపాన వ్యతిరేకోద్యమ అర్ధదశాబ్ద్యుత్సవ సంక్షిప్త సభా నివేదిక

అక్టోబరు 2, 2017న రామచంద్రపురంలో డా. చెలికాని రామారావు సభాసదన్‌లో మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి అర్ధ దశాబ్ద్యుత్సవం జరిగింది. అంతకు 2 సం.రాల ముందు 2015లో వేమగిరి మైత్రేయాశ్రమంలో ప్రజా ఉద్యమకారులు కీ॥శే॥ ఊ. సాంబ శివరావు గారు సహా సుమారు పాతికమంది వక్తలు, మరో పాతిక ముప్పై సంఘాలతో రాష్ట్రస్థాయి మద్య వ్యతిరేక సదస్సు ఏర్పాటు చేసి శ్రోతలు లేక నిరుత్సాహపడిన సందర్భం ఎందుకనో హెచ్చరిస్తున్నప్పటికీ ఈసారి రెట్టించిన ఉత్సాహంతో దాదాపు మూడు నెలల ముందు నుండీ మీటింగ్ కొరకు వర్క్ మొదలుపెట్టా. శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించడమే లక్ష్యంగా 88లో ఏర్పడిన సైన్సు ప్రచారోద్యమ సంస్థ జనవిజ్ఞాన వేదిక ఒక చారిత్రక ఘట్టం. దేశం మొత్తాన్ని తనవైపు తిప్పుకున్న నెల్లూరు జిల్లా మద్యవ్యతిరేకోద్యమ నిర్మాణాన్ని తలకెత్తుకుని ఉద్యమాన్ని వెనకుండి నడిపించింది జెవివినే. అలాంటి సంస్థ కారణాలేవయినప్పటికీ తర్వాతి కాలంలో ముక్కలైంది. ఆ చీలికల పట్ల నాకు వ్యక్తిగతంగా అసంతృప్తి ఉంది. సరే ఎలాగూ రాష్ట్రస్థాయి సమావేశం కనుక మూడు సంఘాల ప్రధాన బాధ్యుల్ని ఒక్క వేదిక పై తీసుకురావడం సాధ్యమవుతుందా? అన్న దిశగా ఆలోచన సాగింది.

ఆరేడు నెలల ముందు ఏదో మీటింగ్ కని ముంబయి వెళ్ళిన నేను మేధాపాట్కర్ని వక్తగా తీసుకొస్తే బావుంటుందనే అభిప్రాయంతో ఆ దిశగా కూడా ప్రయత్నించాను. అర్ధదశాబ్ది సందర్భంగా మద్యపాన వ్యతిరేక సావనీరు కూడా ప్రచురించాలని తలిచాను. మొదట్లో సలహా కోసం సంప్రదించిన మిత్రులంతా ఆలోచనని కొట్టిపడేసారు. కొంతమందయితే సాధ్యం కాదని మొహం మీదనే చెప్పేసారు. ఎవరభిప్రాయాన్ని నేను పరిగణనలోకి తీసుకోలేదు. అప్పటికే పరాజయాలంటే నాకో పాజిటివ్ దృక్కోణం ఉంది. అదీకాక ఈ మూడు భావోద్యమ సంఘాల్ని ఒక్క వేదిక మీదకి తీసుకొచ్చి మైత్రితో వాతావరణాన్ని ఏర్పరచడం



ప్రస్తుత వ్యవస్థలో ఎంత ముఖ్యమో లోలోన ఖచ్చితంగా తెలుసు. కాబట్టే ఆ దిశగా పట్టువదలకుండా హోంవర్క్ చేసాను. మూడు జెవివే అధ్యక్షుల వ్యాసాలతో చేతులు కాల్చుకుని అయినంతలో చిన్ని సావనీర్ను కూడా ముద్రించి సిద్ధం చేసాం. అప్పటికి వారం రోజుల నుండి ఆ మీటింగ్ టెన్షన్తో ఎంత నలిగిపోయానో...!

డా.స్టాలిన్ గారి సహకారాన్ని ఈ విషయంలో ప్రస్తావించి తీరాలి. సభా నిర్ణయం కొన్ని శ్రేణుల్లో గుబులు పుట్టించింది. ముద్రలు, స్టాంపుల సంస్కృతికి అతీతంగా విశాల దృక్పథాన్ని సమర్ధించే ఆలోచనే కొరవడింది. ఆ టైంలో స్టాలిన్ గారు, పెద్దపాటి నరసింహారావు గారు, రవికుమార్ గారు, కె.ఎమ్.ఎమ్.ఆర్. ప్రసాద్ గారు మొదలయినవారు ఇచ్చిన సహకారం మరువలేనిది. మొత్తానికి కార్యక్రమాన్ని ఫైనల్ చేసి అయిందనిపించాను. ఒకటో తారీఖు వచ్చింది. ముందురోజే రామచంద్రపురం చేరుకున్నాను. అప్పటికే ఒక మోస్తరుగా ఉన్న వర్షం ఆ రాత్రి ఉరుములు పిడుగులతో ఎంత భారీగా పడిందంటే, జీవితంలో మరోసారి ఓటమికి సిద్ధమయ్యాను..... చారిత్రకంగా ఆ సమావేశం నాకో, మద్యపాన వ్యతిరేక సమితికో, జె.వి.వి.కో కాదు, ప్రత్యామ్నాయ ప్రజా ఉద్యమాలకి ఎంత ముఖ్యమయిందో అర్థం చేసుకోబట్టీ, రాత్రంతా పడుతున్న వర్షం, ఉరుములు, పిడుగులు నా మీద పడుతున్నట్లే ఫీలయ్యాను. ప్రస్థానంలో మరో పరాజయాన్ని పలకరించడానికి సిద్ధమయ్యాను.

తెల్లారింది. వర్షం కురుస్తూనే ఉంది. ఆకాశం శూన్యంగా ఉంది, నా మనసులాగే. పదైంది. పదిమంది కూడా హాల్లో కనబడలేదు. వర్షం వెల్సింది. సభ మొదలయింది. జనవర్షం కురిసింది. పది, ఇరవై, ముప్పై... యాభై... వంద... నూటయాభై.... లంచ్ టైంకి నూటడబ్బై ప్లస్ డా. చెలికాని రామారావు భవన్ లో తొలి దళిత కవి, మద్యపానాన్ని ఖండించి రాసిన కుసుమ ధర్మన్న సభా ప్రాంగణం పేరుమీద డా. స్టాలిన్, డా. బ్రహ్మారెడ్డి, డా. సి.ఎ. ప్రసాద్, డా. చల్లా రవికుమార్, డా. ఎం.వి.ఆర్. కృష్ణాజీ.. లతో బాటు దేవి, మనోరమ, దుర్గాభవాని వంటి మహిళా ఉద్యమకారులతో వివిధ ప్రజాసంఘాల మద్దతుతో అద్భుతంగా జరిగింది సభ. మద్యపాన వ్యతిరేకోద్యమంలో జీవితాంతం పాటుపడిన వావిలాల

గోపాలకృష్ణయ్య గారికి అంకితమివ్వబడ్డ మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి సావనీర్ 'మానవతకు భరోసా'ను మూడు ప్రధాన ప్రజాసంఘాల రాష్ట్ర అధ్యక్షులు ఒకే వేదిక మీదకి వచ్చి ఆవిష్కరించడం అరుదైన, అందమైన సందర్భం. బ్రహ్మారెడ్డి, దేవిల ప్రసంగాలైతే ఆ రోజు శ్రోతల్ని ఊపేసాయి. దేవి లైఫ్ టైమ్లో ప్రత్యేకమని చెప్పదగిన ఉత్తమ ఉపన్యాసం ఇచ్చారు. రెండు తెలుగు రాష్ట్రాల నుండి ఎంతో మంది కార్యకర్తలు వచ్చారు. అధ్యక్షులు, వక్తలూ కాక సుమారు పాతిక మంది పైబడి ఆరోజు చర్చించారు. స్టీఫెన్ బిందార్, సెర్జ్ జేకొబి అనే ఇరువురు విదేశీ విద్యార్థులు సైతం ఆరోజు శ్రోతలుగా ఉండి ఆతిథ్యాన్ని స్వీకరించారు. శాంతారావు, కృష్ణారావు, నానిబాబు, స్టాలిన్, సూర్యనారాయణ మొదలగు వారి సహకారం మరువరానిది. ఇంకా ఎంతోమంది సొంత కార్యక్రమంలా ఫీలై వచ్చి స్వచ్ఛందంగా పాల్గొన్నారు. మిత్రుడు శివప్రసన్న ఈ కార్యక్రమం గురించి ప్రత్యేకంగా శ్రీకాకుళం నుండి 'మహిళా ప్రగతి వేదిక' కరపత్రాలు ప్రచురించి తెచ్చాడు. అలాగే నాగిరెడ్డి గారు డబ్భైకి పైబడ్డ వయస్సులో కూడా కృష్ణాజిల్లా నుండి విచ్చేసారు. తొంభైఏడు సంవత్సరాల నవయువకులు వెలమాటి సత్యనారాయణ గారు సభకోసమే ప్రత్యేకంగా వచ్చారు. రాజమండ్రి మిత్రులు నా 'అభివ్యక్తి' రచనతో పాటు ఇతర రచనల్ని సభాస్థలిలో పంచారు. సభ సుమారు ఎనభైమంది శ్రోతలతో ముగియడం నాకో రికార్డు. 'సహృదయ మిత్రమండలి' మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి మిత్ర సంస్థ, జె.వి.వి.కి కూడా దగ్గరి సంస్థ, మద్యపాన వ్యతిరేక కార్యక్రమాలను రూపొందించుకుని చేస్తున్న స.మి.మ. మరింత వృద్ధి చెందాలని ఆశిస్తూ భవిష్యత్తుపై ఆశ కల్పించే ఈ సభా రిపోర్టును ఇక్కడ' పొందుపరుస్తున్నాము.

కన్వీనర్

**మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి**



# 15. మద్యపాన వ్యతిరేక గీతం

తాగబోకురోరన్న తాగబోకురా
తాగి తాగి నీ ఒళ్ళు గుల్ల చేసుకోకురా

చరణం॥ నాగరికత పేరుతో సరదాగ నిన్ను చేరుతుంది.
అలవాటుగా మారిపోయి బానిసగా చేస్తుంది.
మనిషివైన నిన్ను మరి పశువుగ మార్చేస్తుంది.
అయిన వారినందరిని దూరం చేసేస్తుంది.

చరణం॥ ఉన్న ఆస్థినంత కాస్త ఊడ్చి పెట్టి పోతుంది
భార్య మెడలో తాళికూడ లాగి తాగమంటుంది.
బిడ్డల చదివించలేక బికారులుగ చేస్తుంది.
ఆసుపత్రిపాలు జేసి రోగాలతో చంపుతుంది.

పచ్చనైన పల్లెల్లో చిచ్చురేపూస్తుంది.
మందుచుక్క పడకపోతే పిచ్చోళ్ళను చేస్తుంది.
నాటుసారా తాగినోళ్ళ నరకానికి పంపుతుంది
మంచిగున్న కుటుంబాన్ని రోడ్డున పడవేస్తుంది.

చరణం॥ పట్నంలో కుర్రాళ్ళకు ఫ్యాషనై పోయింది
పార్టీలకు ఫంక్షన్లకు మందు ముఖ్యమయ్యింది.
దుర్మార్గపు పనులన్ని నీచేత చేయిస్తది
సంఘంలో గౌరవాన్ని లేకుండా చేసేస్తది

రోడ్డుమీద ప్రమాదాలు పెరిగిపోతున్నాయి.
నేరాలు ఘోరాలు పేట్రేగుతున్నాయి
గాలిలోని దీపాలుగ ప్రజలందరి జీవితాలు
మద్యపానమాపేందుకు కలుపుదాము మన చేతులు ॥తాగ॥

# ఇది ముగింపు కాదు !

అద్వితీయమైన ఒక ప్రాంతం అచేతనంగా పడుండడానికి గల కారణాల్ని అందరం కలిసి అన్వేషించడం అవసరం, ఎంతో చరిత్ర గల పిఠాపుర పట్టణం ఈ రోజు స్తబ్ధతగా ఉంది. సాహిత్య సామాజిక సాంస్కృతిక రంగాలలో తులతూగిన స్థలం నేడు శ్మశాన వైరాగ్యంతో నిశబ్దంగా ఉన్నది. ఇది విచారించాల్సిన విషయం. గత రెండు దశాబ్దాలుగా ఎంతో చైతన్యవంత పాత్రను నిర్వహించిన సహృదయ మిత్ర మండలి, మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి, తదితర సంఘాలు సైతం ఈరోజు నిశ్శబ్దంగా ఉండటం బాధాకరం, ఈ గడ్డు పరిస్థితులను అధిగమించడం తక్షణ కర్తవ్యం. అందులో భాగమే ఈ అక్షర సమాహారం.

ఇదిక్కడితో ముగిసిపోకూడదు. సామాజిక పురోగమనాన్ని ఆకాంక్షించే ఏ ఆర్గనైజేషనైనా మునుముందుకు సాగిపోవాలే కానీ ఎప్పుడూ ఆగిపోకూడదు. అందుకే ఎన్ని అవాంతరాలు ఎదురైనా ఇంకెన్ని అవరోధాలు అడ్డుకున్నా అనుకున్న విధంగా అందరి సహకారంతో ఈ చిన్న కరపత్రాల సంకలనాన్ని ఇలా మీ ముందుకు తీసుకువస్తున్నాం. సామాజిక ఉద్యమ చరిత్రలో, ముఖ్యంగా, వ్యసన వ్యతిరేకోద్యమ చరిత్రలో మద్యానికి వ్యతిరేకంగా రెండు దశాబ్దాలు కాలక్రమంలో ముద్రించిన కరపత్రాల్ని ఇలా ఒక్క దరికి చేర్చి ఒక సంకలన రూపంలో పుస్తకంగా ప్రచురించడం అనేది మొట్టమొదటి సారిగా జరుగుతోందని ఈ ప్రయత్నం గురించి తెలిసిన మిత్రులు అంటున్నారు. చాలా సంతోషకర విషయం.

ఒక వినాశకరమైన వ్యసనానికి సంబంధించిన కరపత్రాలు కూడా ఎంత శక్తివంతమైన పాత్ర పోషించగలవో నిరూపించిన ఈ సంకలనం నిజంగా సమిష్టి సహకారానికి సామరస్యపు నిదర్శనమని చెప్పవచ్చు. పౌర సమాజాన్ని మరింత చైతన్యం చేయడానికి భవిష్యత్తు కార్యకర్తలకు, ప్రజాతంత్రవాదులకు ఒక పనిముట్టుగా ప్రయోజనం చేకూర్చే అక్షర సాధనం ఈ పుస్తకం.



అనేక సంక్షోభాల మాయలో పడి బతుకీడుస్తున్న ఈనాటి తరాలకి మానవీయ స్వరాల్ని బలంగా పరిచయం చేసేవి నిబద్ధత కలిగిన అక్షరాలే. అలాంటి అక్షరాలకి పెద్దపీట వేయడం ద్వారా స్థానికంగానే కాక తెలుగులో తొలి మద్యపాన వ్యతిరేక కరపత్రాల సంకలనంగా దీనిని కూర్చి ముందడుగు వేయడానికి సహకారం అందించిన అందరకీ మరొక్కసారి ధన్యవాదాలు.

ఇంకా చేర్చలేకపోయిన కరపత్రాలు కొన్ని ఉండవచ్చు. మిత్రులెవరి దగ్గరైనా అవి దొరికి ఇవ్వగలిగితే రాబోయే రోజుల్లో వాటిని కూడా జతపరుస్తామని హామీ ఇస్తూ, మొత్తంగా ఈ ప్రయత్నంలో భాగమైన శ్రేయోభిలాషులు అందరూ వారి వారి సహాయ సహకారాలు ఎల్లప్పుడూ మంచి పనులకి ఈ విధంగానే అందించాలని ఆశిస్తూ, విమర్శలకి ఆహ్వానం. సెలవు.




ది. 29-10-2017 మద్యపానానికి వ్యతిరేకంగా మహిళల నినాదాలు.

## మద్యపాన రహిత సమాజాన్ని నిర్మించాలి




పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న మేధాపాట్కర్

రాంనగర్: గాంధీజీ కలలుగన్న మద్యపాన రహిత సమాజాన్ని నిర్మించాలని సామాజిక కార్యకర్త, బచావో ఆందోళన్ సంస్థ అధ్యక్షురాలు మేధా పాట్కర్ అన్నారు. బాగ్‌లింగంపల్లి సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో శుక్రవారం అప్సా స్వచ్ఛంద సంస్థ, నేషనల్ అలియాన్స్ ఆఫ్ పీపుల్ మూమెంట్(ఎన్‌ఏపీఎం)సంయుక్త ఆధ్వర్యంలో 'నషా ముక్తి భారత్ ఆందోళన్'పై సమావేశం నిర్వహించారు. భారతదేశాన్ని మత్తు, మద్యపాన రహితంగా మార్చాలని ఈ నెల 2 నుంచి 12వ తేదీ వరకు తలపెట్టి జాతీయ యాత్రలో భాగంగా ఈ సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా మేధా పాట్కర్ మాట్లాడారు. గౌరవ్ రాసిన 'మద్యపానమా.? మానవత్తమా..? అనే పుస్తకాన్ని ఆమె ఆవిష్కరించారు. కార్యక్రమంలో నర్మద, సంధ్య, రామకృష్ణ, శ్రీనివాస్, సునీలా, ఉపేంద్రసింగ్ పాల్గొన్నారు.



## బీరులో ఎటువంటి పోషకాలూ లేవు

### :. ఐఎంఏ సభ్యులు డా.పిఎన్ రాజు

(పిఠాపురం, కెఎన్‌ఎన్)

బీరులో ఎటువంటి పోషక విలువలూ లేవని, అది తాగడం వల్ల అనారోగ్య సమస్యలు తలెత్తుతాయని పిఠాపురానికి చెందిన ఇండియన్ మెడికల్ అసోసియేషన్ సభ్యులు పిఎన్ రాజు స్పష్టం చేశారు. బీరు ఒక ఆరోగ్య పానీయం ప్రచారం జరుగుతున్న నేపథ్యంలో పిఠాపురం జన విజ్ఞాన వేదిక ఆధ్వర్యంలో అవగాహనా కార్యక్రమాన్ని మంగళవారం నిర్వహించారు. ఇతర మత్తు పానీయాలు మాదిరిగానే బీరు సేవించడం వల్ల కూడా లివర్ చెడిపోవడం, సిర్రోసిస్, పాంక్రియాస్ వంటి వ్యాధులు వస్తాయని నాగరాజు తెలిపారు. మత్తుపానీయాలు మనిషికి ఏవిధంగానూ ఆరోగ్యకరం కాదని ఈ ప్రచారం నమ్మొద్దని ఆయన తెలిపారు. కార్యక్రమంలో జన విజ్ఞాన వేదిక అధ్యక్షులు కె అప్పారావు, ఉపాధ్యక్షులు ఎన్ సూర్యనారాయణ, యూటిఎఫ్ కార్యదర్శి సుబ్రహ్మణ్యం, జిల్లా నాయకులు ప్రసాద్‌బాబు, జిల్లా భవన నిర్మాణ కార్మిక సంఘం ఉపాధ్యక్షులు కరణం· విశ్వనాధం, సహృదయ మిత్రమండలి కన్వీనర్ సిహెచ్ సతీష్ తదితరులు పాల్గొన్నారు.

## మద్యం రహితంగా కొత్త సంవత్సరాన్ని ఆహ్వానిద్దాం

**ప్రజాశక్తి-కాకినాడ**

మద్యం లేకుండా యువతరం నూతన సంవత్సర వేడుకలను జరుపుకోవాలని జెవివి ఆధ్వర్యంలో ప్రదర్శన, మానవహారం నిర్వహించారు. ఈ సందర్భంగా భానుగుడి జంక్షన్ వద్ద జెవివి జిల్లా అధ్యక్షులు కెఎంఎంఆర్.ప్రసాద్ అధ్యక్షతన సభ నిర్వహించారు. 'మద్యం వద్దు-ఆరోగ్యం ముద్దు' అనే నినాదాలతో బెలూన్స్ ఎగురవేసారు. అనంతరం జెవివి రాష్ట్ర గౌరవాధ్యక్షులు డాక్టర్ స్టాలిన్, జిల్లా గౌరవాధ్యక్షులు డాక్టర్ పి.చిరంజీవినీ కుమారి, యుటిఎఫ్ జిల్లా గౌరవాధ్యక్షులు జి.ప్రభాకర వర్మ, ఎస్‌టియు జిల్లా అధ్యక్షులు సుబ్బరాజు, మద్యపాన వ్యతిరేక పోరాట కమిటీ నాయకులు డా.సూర్యనారాయణ, ఎస్ఎఫ్ఐ జిల్లా కార్యదర్శి టి.రాజా తదితరులు మాట్లాడారు. పాలకులు మద్యాన్ని ఆదాయవనరులుగా చూస్తున్నారని దీనివల్ల క్రైమ్ రేటు పెరగడమే కాకుండా కుటుంబాలు వీధిన పడుతున్నాయన్నారు. పబ్ కల్చర్‌పై ప్రభుత్వాలు నియంత్రణ విధించాలన్నారు. ఈ సందర్భంగా జెవివి రూపొందించిన కరపత్రాన్ని విస్తృతంగా పంచిపెట్టారు. ఈ కార్యక్రమంలో ఆలపాటి శ్రీనివాస్,



కాకినాడలో ర్యాలీ నిర్వహిస్తున్న జెవివి నాయకులు

డా.సత్యనారాయణ, ఉదయ్‌శేఖర్, బివివి సత్యనారాయణ, చింతపల్లి సుబ్బారావు, ఎస్ఎఫ్ఐ నాయకులు కె.దుర్గాప్రసాద్, ఎన్.స్పందన, మనోజ్, కెవిపిఎస్ నాయకులు కృష్ణమూర్తి, పలివెల వీరబాబు, తదితరులు పాల్గొన్నారు.

**జగ్గంపేట** : కొత్త సంవత్సరాన్ని మద్యం రహితంగా ఆహ్వానించాలని జెవివి ఆధ్వర్యంలో ప్రచారం నిర్వహించారు. స్థానిక ట్రావెలర్స్ బంగ్లా నుంచి మెయిన్‌రోడ్డు మీదుగా విద్యార్థులతో ర్యాలీ నిర్వహించారు. ఈ సందర్భంగా జెవివి అధ్యక్షులు డాక్టర్ ఒమ్మి రఘురామ్ మాట్లాడుతూ నూతన సంవత్సరంలో మద్యం జోలికి పోకుండా తల్లిదండ్రులు, సమాజం గర్వపడేలా ఆహ్వానం పలకాలన్నారు. ఒకసారి మద్యపానానికి అలవాటు పడినవారు తప్పించుకోలేరని తెలిపారు. ఈ కార్యక్రమంలో జెవివి కార్యదర్శి జిహెచ్‌ఎస్‌పి.వర్మ, యుటిఎఫ్ నాయకులు ఎంవి.సాయిరామ్, మార్నీడి సత్యనారాయణ, ఉపాధ్యాయులు, విద్యార్థులు పాల్గొన్నారు.

**పిఠాపురం** : నూతన సంవత్సర వేడుకలను మద్యంతో కాకుండా ఆట, పాటలతో జరుపుకోవాలని సూచిస్తూ శనివారం జన విజ్ఞాన వేదిక ఆధ్వర్యంలో నవ చైతన్య జూనియర్ కళాశాల విద్యార్థులు పిఠాపురంలో భారీ ర్యాలీ నిర్వహించారు. ఈ సందర్భంగా జెవివి జిల్లా ఉపాధ్యక్షుడు ఎన్.సూర్యనారాయణ మాట్లాడుతూ నూతన సంవత్సర వేడుకలను నేటి యువత మద్యపానం సేవించి జరుపుకుంటున్నారన్నారు. అయితే దీనివల్ల అనేక ప్రమాదాలకు గురై ప్రాణాలు సైతం పోగొట్టుకుంటున్నట్లు తెలిపారు. ఈ కార్యక్రమంలో కళాశాల ప్రిన్సిపాల్ శ్రీనివాస్, జెవివి నాయకులు కె.అప్పారావు, సతీష్, స్టాలిన్, వేణుగోపాల్, సుబ్రహ్మణ్యం తదితరులు పాల్గొన్నారు.